## దండిక లేక దండలాస్యము

కోలాటపు కోపులు దండిక అని పిలువబడును. చిన్నచిన్న కర్రలను చేతగొని తాళగతి ననుసరించి తట్టుతూ నాట్యమాడుదురు గాన ఆ పేరుతో పిలువబడినది. ఇది బృంద నృత్యము.

## కందుక క్రీడ

చిన్న బంతులను చేతగొని ఆడుతూ నర్తనము చేయుట కందుక క్రీడ. పూర్వము రాణివాసములందు ఈ విద్య విరివిగా ప్రచారము నందుచుండినది. కృష్ణుడుకూడా ఈ ఆటను ఆడినట్లు నారాయణతీర్థ యతీంద్రులవారు తమ కృష్ణలీలాతరంగిణిలో కృష్ణుడు బంగారు చెండుతో ఆడినట్లు వర్ణించియున్నారు.

## కారువా మేళము

నాట్యమేళములోని కొందరు నర్తకులు గోపికలుగాను, మరికొందరు కృష్ణులుగాను వేషధారణ జేసికొని, రాధాకృష్ణ పాత్రలు నడుమనిల్చి నర్తనము సలుపుచుండగా మిగిలిన స్త్రీ పురుష పాత్రలు- కృష్ణపాత్ర గోపికపాత్ర ఒకరి తరువాత ఒకరు వరుసదప్పక నిలువబడి, వలయాకారముగా తిరుగుచూ వివిధ గతుల నర్తనమాడుట కారువామేళము. దీనినే 'కరణి' అందురు. ఉత్తరదేశములో "రాసలీల" అనే పేరుతో ప్రచారమందుచున్నది నృత్యము. ఈ నృత్యమును జూచియే, లీలాశుకుడు తన 'కృష్ణ కర్ణామృతము' నందు రాసక్రీడ వర్ణించెనేమో?

## చిందు

చతురశ్ర, తిశ్ర, మిశ్ర, ఖండ, గతులలో యేదోఒక గతి నాధారముగా జేసికొని ప్రదర్శింపబడే జానపద నృత్త విశేషము చిందు.

## మోడి, మొగ్గవాలుట

పాము నాట్యముకాని, పాములవాని వంటివాని నాట్యమాడుట 'మోడి' నర్తన మనబడును. నర్తకి శరీరమును వెనుకకు వంచి భూమిపై చేతులను ఆనించి నొసలు భూమికి తగులునట్లు శిరసు నేలకు అంటించుట 'మొగ్గుట' లేక "మొగ్గవాలుట" అనబడును. పూర్వము నర్తకినులు మొగ్గవాలి నొసటితో రూపాయల నెత్తుట, కనురెప్పలతో సూదులను దీయుట మొదలైన చమత్కారములను ప్రదర్శించెడివారు. ఇవి ముఖ్యముగా సాముగరిడీ విద్యలు మాత్రమే. ఇందు కళాప్రదర్శన ముండదు. ఈ విద్యసాధన శరీర సౌష్టవము నభివృద్ధి పరచు కొనుటకు మాత్రముపయోగించును.

## అలరింపు

భరతనాట్య ప్రదర్శనారంభములో చేయబడే నృత్త విశేషము. 'అలరింపు' అనగా పుష్పించుట లేక వికసించుట. సమస్థానకమునందు, సమ భంగిమయందు నిల్చిన నర్తకి శరీరము, "ఓం" కార మిళితమైన మృదంగ నాదమునకు వికసించి, పరిమళించి, ప్రేక్షక లోకమును విస్మయానంద డోలికల నోలలాడించుటయే అలరింపు నృత్త విశేషము.

## జతిస్వరము

ఒక రాగముయొక్క స్వరములను ఒక ప్రత్యేక తాళములో బంధించి దాని నాధారము జేసికొని వివిధ రీతుల స్వరకల్పనలు, వివిధగతులలోచేసి, ఆ కల్పనలకు, లనుకూలమైన రీతిని మృదంగ జతుల నేర్పరచి-నృత్తమాడుట జతిస్వరము. ఇందు స్వరములు వుండును. మృదంగ జతులుగూడా వుండును. దీనినే పల్లవినాట్యమనికూడా అందురు. ఈ పల్లవి నాట్యము స్వరపల్లవి, సాహిత్య పల్లవి, శబ్దపల్లవి అని మూడు విధములుగా నున్నది.

## స్వరపల్లవి

రాగము స్వరూపమును చెప్పు స్వరములను తాళమునకు సరిపడునట్లు యేర్పరచి వానికి నృత్తమాడుట స్వరపల్లవి.

## శబ్దపల్లవి

ఇందు మృదంగ శబ్దములనే ఒక రాగములో పాటగా పాడుతూ, మృదంగ జతులకు నృత్తమాడబడును.

## సాహిత్యపల్లవి

శివ లేక విష్ణు సంబంధమగు స్తోత్ర గీతములను ఆధారముగా జేసికొని ఆపల్లవికి వివిధరీతుల అడవులుకట్టి ఆడుట సాహిత్యపల్లవి ఆట అగును.

## వర్ణము

పదవర్ణము, తానవర్ణము, చౌకవర్ణము. తానవర్ణము సంగీత సాధనకు యెక్కువగా ఉపయోగింతురు. నాట్యమునకు అంతగా వుపయోగములేదు.

## పదవర్ణము

పల్లవి, అనుపల్లవి, చరణములు కలిగి నృత్త నృత్యాభినయములు ప్రదర్శించుటకు అనువైన స్వర పోతలు, సాహిత్యపు సొంపులు. నడకలు, జతి విన్యాసములు. యతివిశేషములతో అలంకరింపబడిన సంగీత రచన పదవర్ణము. ఇది నాయికా నాయకుల విరహ వియోగ సమాగమముల వర్ణనలతో గూడినట్టి విశిష్ట రచన. ఇందు పల్లవికి అభినయము, పల్లవినాధారముగజేసి త్రికాల అడవు విన్యాసములతో గూడిన ముక్తాయింపులు. చిట్ట స్వరములకు నృత్తము. చరణస్వరములందు పఠింపబడిన సాహిత్యమునకు నృత్యముండును. నృత్తనృత్యాభినయములు సమపాళ్ళలో పోషింపబడిన, రచనయగుటచేతనే దీనికి భరత నాట్యములో విశేష ప్రాముఖ్యత యివ్వబడుచున్నది.

### చౌక వర్ణము

దీనినే పెద్దవర్ణమని గూడా అందురు. ఇది పదవర్ణముకంటె విలంబిత లయలో నర్తన మాడబడును. పద వర్ణముకంటె యెక్కువ చరణములు గల్గి బహు కష్టతరమైన అడవు విన్యాసములు అభినయవిశేషములు గల్గియుండును. 'గోవింద సామయ్య పంచకము' అని ఐదు వర్ణములు ఆయనచే రచింపబడినవి ఈ పెద్ద వర్ణములు. ఈ గోవిందస్వామి కార్వేటినగర సంస్థాన నర్తనాచార్యుడు. ఇందు నవరోజు, కేదారగౌళ, మోహనరాగములందు రచింపబడినవి. ఆంధ్రలో యెక్కువగా ప్రచారమందున్నవి. ఈ వర్ణములాడుట బహు కష్టముగాన ప్రస్తుత కాలము కళాకారులు ఈ వర్ణముల సాధనజేయుట మానివేసినారు.

### జావళి

పదమువలె శృంగార రసప్రధానమై నృత్యమునకు అనువగు విధాన మధ్యమ కాల సాహిత్యము గలిగినట్టి రచన.

### అష్టకము

ఎనిమిది చరణములు గల్గిన సంగీత రచన. ఇవి దేవతా స్తోత్రములు గాన యెక్కువగా ఆలయములందు పాడబడును.

### అష్టపది

జయదేవుని గీత గోవిందములోని రాధ మాధవుల ప్రేమను వర్ణించు పాటలు అష్టపదులనబడును. ఈ పాటలు ఒక్కొక్కటి యెనిమిదేసి చరణములు గల్గియుండును గాన 'అష్ట పది' అని పిలవబడుచున్నది.

### తరంగము

యతినారాయణ తీర్థులవారు రచించిన కృష్ణలీలాతరంగిణి లోని పాటలు తరంగములని పిలువబడుచున్నవి. ఇవి నృత్తమునకు యెక్కువగా నుపయోగించును. సముద్రమునందు తరంగములవలె ఈ నర్తనము తాళ లయల మేళితమై భక్తిరసముప్పొంగి ప్రేక్షకుల భక్తిపారవశ్యమున మైమరపించును గాన ఈ గీతములు తరంగము లనబడును.

### లావణి

అంత్యప్రాసగల్గి; చతురశ్ర, మిశ్ర, తిశ్ర, ఖండ, ఈ నాల్గు జాతులందు యేదైన ఒక గతిలో రచింపబడిన శృంగార గీతము.

### తిల్లాన

దురిత గతిని నృత్తమాడుటకు అనుకూలముగా మృదంగ జతులతో కూర్చబడినపాట తిల్లాన. ఇందు పల్లవి, అనుపల్లవి, మృదంగ వరుసలునూ, చరణము సాహిత్యమును గల్గియుండును. పాట మధ్యమకాలములో నుండును. ఈ నృత్తము భరతనాట్యములో ఆఖరిదిగా ప్రదర్శింతురు. పాట మధ్యమకాలములో నున్నను, ఆట త్రికాలములందు ప్రదర్శింపబడును.

### సూలూక్రమము

నాట్యారంభంలో నర్తకి సమభంగిమలో నిలబడి, మలయ మారుతముయొక్క తాకిడికి దీపకళిక వోలె, మృదువుగా శరీరమును చలింపజేయుట సూలూక్రమ మనబడును.

### దేశినృత్తము

సప్తలాస్యములందలి ఒక ప్రత్యేక నృత్త విశేషము 'దేశి నృత్తము'. ఈ దేశినృత్తము వేరు. దేశి సంప్రదాయము వేరు. ఈ దేశి నృత్తము ప్రత్యేకముగా ఆలయములందు చేయబడును.

### ముక్తపదము

ఇద్దరు నర్తకినులు పోటీపడి నాట్యమాడునప్పుడు, ఒక నర్తకి ఆడిన జతియొక్క ఆఖరి శబ్దములనుగొని వానిని మొదటి అక్షరములుగా జేసి యతిబద్ధముగా యింకొక జతి నల్లి వెనువెంటనే మరొకరు నర్తనమాడుట ముక్తపదము లేక ముక్తపద గ్రస్తము. ఇది పండితులైన యిద్దరు విద్వాంసుల విద్యాపరీక్ష సమయములందు జరిగే పోటీలందు ప్రదర్శింపబడును.

### చక్రవిన్యాసము

ఒక జతిని ముందుగా రెండుమూడు ఆవృత్తములలో రూపొందించి, క్రొత్తశబ్దములను జేర్చకుండా, అందలి శబ్దములనే త్రిప్పిత్రిప్పి వివిధరీతుల అల్లుతూ, దానికి తగినరీతిని నర్తన మాడుట చక్రవిన్యాసము.

### యతివిన్యాసము

యతులు (జతిరూపకల్పనలు) డమరుకము, మృదంగము, గోపుచ్ఛము, నాగబంధము మొదలైనవి అనేకము లున్నవి. ఆ యతిస్వరూపముననుసరించి మృదంగ శబ్దములను కూర్చుకొని నృత్తమాడుట యతి ఆట అగును. దీనికి జతిస్వరమునకు సంబంధము లేదు.

### సమస్య

నర్తకి సభలో అభినయించుచున్నప్పుడు ఒక పదములోని ఒక పాదమునిచ్చి, దానిని వివిధనాయికలుగా రూపొందుతీరున ధ్వని ప్రాధాన్యతతో అర్థపు మార్పులతో అభినయించమని పండితులు కోరుట, నర్తకి అభినయించుట 'సమస్య' అనబడును. ఇది పండితసభలకుజెందిన కళాగోష్ఠి.

# పురాణేతిహాస కావ్యప్రబంధములందు వర్ణింపబడిన నృత్యవిశేషములు

వైదికమతము ఆంధ్రలో విరివిగా ప్రచారమునందున్నప్పుడు యజ్ఞయాగాది క్రతువులందు దేవతలను అనేకరకములైన నాట్యములతో ఆరాధించెడివారు. అష్టదిక్పాలకులు, నవగ్రహములు, పంచభూతములను వివిధరకములైన నృత్యగీతములతో పూజించెడివారు. రుద్రుని ఆరాధనయందు వివిధములైన నాట్యములు ఆడబడినవి. ఈ నాట్యములయొక్క వివరములు చాలావరకు "భరతార్ణవము" నందు వర్ణింపబడినవి. ఈ నాట్యములనే కొన్నికొన్ని మార్పులు చేర్పులతో మనదేశములోని దేవతలకు ఆలయనిర్మాణము జరిగిన పిదప దేవదాసీలు ప్రదర్శించుట ప్రారంభించిరి. వీనినిగూర్చి "దేవనర్తకి - ఆలయ నృత్యములు" అనే గ్రంథములో విపులంగా చర్చించాను.

* * *

బౌద్ధము ఆంధ్రలో వ్యాపించినకాలమందు బౌద్ధ దేవతల ఆరాధనయందు నృత్యసంగీతములు గూడా ఒక భాగమై వుండినవి. ఆ సంప్రదాయముల స్వరూపము పూర్తిగా తెలియకున్ననూ, ఆనాటి చరిత్రకారుల వర్ణనల ద్వారా కొంతవరకు నాటి కళలగూర్చి, కళాకారులగూర్చి, కళారాధన గూర్చి తెలియుచున్నది.

ఆలయాల్లో దైవసేవనిమిత్తము బౌద్ధభక్తులు కొందరు తమ పుత్రికలను ఆలయములకు అంకితము జేసెడివారు. వారు దేవతల ఆరాధనలందు పాల్గొనుటకుగాను నృత్యగీతముల నభ్యసించెడివారు. మతగురువులు దేవతల ఉత్సవ సమయములందు వారిని ఆహ్వానించి నృత్యసంగీతములతో దేవతల ప్రీతికొరకు వేడుకలు జరిపించెడివారు. నృత్యపూజయందు పాల్గొను [illegible] వచ్చే సమయములందు ఆ దేవనర్తకీలు, ఫలపుష్పములు, [illegible]ములైన భక్ష్యములనుదెచ్చి దేవతలకు నివేదనజేసి, నృత్యము సల్పిన తరువాత ఆ ప్రసాదమును యిండ్లకు గొనిపోయెడివారు. వారి వివాహమువరకు ఈ విధముగా నృత్యపూజయందు పాల్గొని, వివాహానంతరము విరమించెడివారు.

(ఇట్టి సంప్రదాయము నేటికినీ బలిద్వీపములో నున్నది.)

కొన్నివేళలందు దేవతామూర్తులకు, వారి అర్ధాంగులందు విరక్తిగలిగినప్పుడు సామాన్య ప్రజలు దైవప్రీతికి దూరమగుదురు గాన అట్టి దేవదంపతులకు శాంతినిగూర్చి, వారిలో పరస్పరానురాగము పెంపొందుటకుగాను దేవనర్తకీలగు బాలికలు నగ్నరూపమున నర్తనమాడెడివారు. అప్పుడా దేవతలు మనశ్శాంతిని పొంది భక్తులను పాలించెదరని వారి నమ్మకము.

(ఇట్టి నాట్యములు బెంగాలులో నేటికినీ చేయుదురట - నాగవంశీయులనే ఒక ప్రత్యేక తెగవారు నాగపంచమినాటి రాత్రి 'బెహుళ' అనే పేరుతో నాగదేవుని ప్రీతికొరకు ప్రదర్శించే ఆరాధన నాట్యము ఈ తరగతికి జెందినట్టిదే. ఈ నాట్యము ఆ ప్రత్యేక తెగకు జెందిన ఆరాధకులుమాత్రము జూచే అర్హతగలిగియుందురు.)

ఆంధ్రలో దేవదాసీలుగాక కొన్ని వ్యవసాయ తెగలవారు తమ బాలికలను దేవతల సేవనిమిత్తము కైంకర్యముజేయుట ఒక ఆచారముగా వుండినది. వీరు ముఖ్యముగా శివాలయములకు జెందియుందురు. వీరినే బసవిరాండ్రు, పార్వతులు అని పిలుతురు. ఈ సంప్రదాయము ప్రాచీనకాలమునుండి వచ్చినదైననూ బసవిరాండ్రు నర్తనమాడరు. దేవదాసీ తెగవారుమాత్రము నృత్యము జేయుదురు. బసవిరాండ్రు అవివాహితలై దైవసేవయందు జీవితము గడుపుదురు.

* * *

బౌద్ధము తరువాత శైవము, వైష్ణవము మనదేశములో ప్రబలియుండినవి. ముఖ్యముగా శైవసంప్రదాయములో సప్తలాస్యములు యెక్కువగా ప్రదర్శించెడివారు. ఇవి ఆరాధన పద్ధతికి జెందినట్టివి. వీనినిగూర్చి వేరుగా వ్రాశాను.

* * *

భారతములో - విజయుడు బృహన్నల రూపమున నర్తనశాలలో విరటుని కొలువున సంగీత నాట్యములు ఉత్తరకు చెప్పినది సుప్రసిద్ధమే. సుభద్రయును ఈ కళను చక్కగ నభ్యసించినదట. సంగీతము, నాట్యము స్త్రీలకు విద్యలోని ముఖ్యభాగములుగ పురాతనమునుండియు గణింపబడుచుండెననుట నిస్సంశయము.

భారతములో బృహన్నల :

"కన్నియలకు నాట గరప నోపుదు
యభ్యసించితిని శైశవ మాదిగాగ దండలాసిక విధమును
గుండలియును, ప్రేంఖణంబు తెరంగును, ప్రేరణంబు;
విశ్రుతవాద్యంబులు, మంజుశ్రుతిసం భావ్యగీత సంగతులు
వద్యావాశ్రయములు, దక్షవ్యరసాశ్రయములు నైన
యభినయంబు లెఱుగుదున్
ఇన్ని తెఱగుల శ్రమము సేయింతు, నట్టి వాఁడనై
మెలగుదు నగరులందు"

## బసవ పురాణము (పాల్కురికి సోమనాథుడు)
### తృతీయాశ్వాసము
### ముగ్ధ సంగయ్య కథ
### చంద్రోదయ వర్ణనము

(గణిక) అక్కాంత ముగ్ధ సంగయ్యకు ప్రీతి–నెక్కొని యాత్మలో
నివ్వటిలింగ
వనయంబు లింగపూజనలనటించు – తనదు విలాసినీ
జనుల రావించి
యక్క మహాదేవి! యల్లమద్దెలలు – జక్కాల్పి వేగంబు సంధింపు
కొనుడు
స్వరమానమున బసవప్రమదవ్వ – కరమర్థి బట్టుడు కాహళలోలి
సకళవ్వ! నీవును సంగళవ్వయును – నొకరీతి నిలువుడు
సుకరంబుగాను
బాలరుద్రమ! యొత్తు పట్టుగవాళ – గ్రోలు వాయింపుము
గుడ్డవ్వ! నీవు
సిట్టి తాళమువట్టు శివాదేవి! నీవు – సట్టున నృత్యంబు
సరసం బెటింగి
సంగుదాసమ! మహేశ్వరి! వీరభద్ర – లింగవ్వ! మీరు గేళికలు
సేయుండు
రమణదుకూలంబదముసు గంచుకము నమరించుకొని
చల్లడము బిగించి
యేతెమ్మ నీవు పురాతమ్మ! శ్రీపు – పాత తమ్మగ నృత్యమాడు
దురుగాని
తాళముల్వట్టుడు దాళగింపుడు – నారతివేళకు నందరు నసుచు
నవిరళంబుగ నంత నాప్పటంబిచ్చి – జవనికరప్పించి
సరసమై నిలిచి
పొలుపగు ముఖరసంబును సౌష్టవమ్ము – లలియు భావంబు
ధూకళియు ఝుంకళియు
మరియు తేవయు విభ్రమము రేఖయును – నెఱయంగ
నీరీతి నృత్యంబు సలుప
లింగార్చనంబు సల్లీల జేయుచును – మంగళారవములు సంగడి
నులియ
వెల్లవే గుడు స్వచిత్తోల్లాసమమర – సల్లీల నమ్ముగ్ధ సంగయ్యకిట్టు
లింగన పరిచర్య లాచరింపంగ – లింగావసరము చెల్లించునంతటను

* * *

## పండితారాధ్య చరిత్ర – పర్వత ప్రకరణము
### శివరాత్రి జాగరము – ఆటపాటలు
### 10 విధముల దేశీయములగు ఆటలు

(1) చిందు, కోడంగి యాట

(2) ప్రన్నని నిజదేశ భాషల జతుల కన్ని కోడంగాట లాడెడివారు.

(3) భ్రమరముల్ పాళముల్, బయకముల్ మెఱసి రమణ బంబాసి పేరది యాడువారు.

(4) ప్రమధ పురాతన పటుచరిత్రములు గ్రమమొంద బహునాటకము లాడువారు.

(5) లలితాంగ రసకళాలంకారరేఖ – లలవడ బహురూప మాడెడివారు.

(6) గరణముల్ మెరవణుల్ గతులు చిత్రములు నరుదుగ గడలపై పెర్ణంగ మాడెడివారు.

(7) సమయంగనలు దివివాడెడుమాడ్కి సమరంగ గడలపై వాడెదువారు.

(8) నావియుగ్గతి బహులాదెడినట్టి – భావనమ్రోకులపై నాడువారు

(9) భారతాది కథల జీరమణుంగుల – నారంగ బొమ్మల నాడించువారు (తోలుబొమ్మలు)

(10) గడునద్భుతంబుగ గంబసూత్రంబు – లడరంగ బొమ్మల నాడించువారు (కొయ్యబొమ్మలాట)
నాదట గంధర్వ యక్ష విద్యాధ – రాదులై పాడెదు నాడెదు వారు.

## దేశీయ నాట్యపద్ధతి

### ఆహార్యము

విధమున ప్రచ్ఛన్న వేషముల్ దాల్చి – యధికోత్సవ
ముదులుకొద నాట్లాడు
శిరమున సురపుని పెప్పల కంతిముసి – గరముల గూకట
కాళ్ల జెల్వార
గవదండటను గనుగప గవణికలు – సవరంబులును
గలకంబు దండలును
భసితంపుపూతపై బరగు బిచ్చనలు – నలరాము చిరు
గజ్జియలు సందయలును
పరివత్న పంక్తుల జిలదొసనములు – గరమొప్పు తొంగళ్లు గల
చల్లడములు
బొల్చు దంతావళుల్ పుష్పమాలికలు – దాల్చి యత్యద్భుతోత్సవ
లీల దనర

## ప్రవేశము

ఘనులు హర్షింప నాస్థానముల్ సొచ్చి — యనుకూల వివిధ వాద్య
సమ్మేళనమున
నార్పటంబిచ్చి యొయ్యన। యవనికల — గర్వంబు వెడలి యక్క
జము ప్రబల్ల
నాడకసుందర నళినయం బొలయ — జూడక సుందర చోద్యంబు.

## ప్రారంభాభినయము

నిక్కుచు త్రిభంగి నిలుచుచున్నట్లు — చొక్కుచు నభ జూచి
యొక్కింతనగుచు
ఒప్పంగ నంచలనంబునంద గతుల — లలిగొ భ్రూలతలన
సరసంబు
మెయియు విభ్రోల్లాసమునను రంజకత — దనర గటాక్షంబునను
గుశలంబు
లలరి శిరీకంపన మాచరించుచును — సలినంగుళి స్ఫోటనంబు
సేయుచును.

## దేశీయాభినయములు

### (తనుగతులు)

1 2 3 4 5 6 7
లాగు, వంచళము, ధాళము, వళి, డిప్పు, దాగు, వాహిణి,
8 9 10 11
సాళి, బయగతి, సుగతి, బహుగతి గతియు
నా బరిపాటి దనర — సహజమై స్వతనుగతి స్వర పంచనముల

**హంగు**

బటుర సాలంకార భావముల్దనర — స్ఫుటవాద్య తాళ
సంఘటన ఘటిల్ల
దనుపాద ఘట్టన దనరుద్ఘటన — లనుసయించుచు
నందియల్ గదల్చుచును (తాళము వేయును)

**వైఖరి**

'నోహో' యనుచు గతులొడ బెంచుచును—
'నాహ' యనుచు లాస్యమనుసయించుచును
జతుల నాడుచు, దాళగతుల నాడుచును
శ్రుతుల గూడుచు నేల ద్రొక్కి నొడుచును
పీగుచు గరణికల్ విస్తరించుచును
లోగుచు దంతావళుల్ నటించుచును
బొబ్బలు వాడుచును, బొంగ చూచ్చుచును.

## నానావిధ అంగవిన్యాసములు

### చేష్టలు, దేశీయముగ నానాక్రియ భేదములతో వర్ణన

గుబ్బన లేచుచు గునిసి యాడుచును
జాఱుచు జంగలు సాచుచు, మది
నూఱించుచును మొగంబోఱ పుచ్చుచును
జంక జూపుచు బయల్ నవ్వరించుచును
జంక లడిచికొనుచు శంకరు బాడుచును
నురుకుచు, గ్రేళ్ళు నూపుచు బన్నికొనుచు
గింతులువైచుచు, మణికట్లు వెతమఱించుచు
నురం బొగ్గుచు, పీపు విఱిచికొనుచు,
బురి విచ్చుచు, మోము బాఱడు పుచ్చుచు
భుజంబులు బలియుచును, మోకాళ్ళు తొడలు
ముడి వఱచుచును, ఘూకటిగి ఆపుచు, గోకటించుచును
మూతులు నలుపుచు మురుకటింపుచును, మోతకు నుబ్బుచు
మురియుచు జనుచు
మిన్నక జూచుచు, మెడవిర్చికొనుచు, గన్నులార్చుచు
జెవులు గత్తరించుచును
వెల్వెలు లాకుచు వెక్కిరించుచును —
గప్పపంచులయందు గతులు పుచ్చుచును
బొమిచె త్తివైచుచు బుగ్గరించుచును
దమకించి దాటుచు దండలిచ్చుచును,
గొంకుచు, వడకుచు గొనరుచు మూడు
వంకల బోపుచు శంకించుకొనుచు
బయలచే వ్రేయుచు పకపక నగుచు
గరముబ్బుచును జొల్లు గాఱిచికొనుచు
సరసంబు లాడుచు జప్పటి విడుచు
విరసంబు లాడుచు విఱ్ఱవీగుచును.

## కాలిచేతులతో చేయు విచిత్రక్రియలు

నొడ్డోలగంబులో నొఱసి తిర్గుచును
సిద్దంబు త్రికటంబు సెన్ని నాడుచును
మడగాళ్ళ నడచుచు మట్టి గాళ్ళగుచు
నొంగాళ్ళ నడచుచు ధరగొంతు గొనుచు.
మోకాళ్ల నడుచుచు మొగి నేల నాళ్ల — దాకుమంద నెగసి
తటుకన చనుచు
గూర్చుంచి నడచుచు గుప్పించి యచట — నార్చుచు మొఱము
లందంద వైచుచును
నురమున నడుచుచు నొదికిల యనుచు — ధరబొరలుచు సముద్ధతి
లేచి చనుచు
నుర్వి త్రిప్పటమున నొరప్రేల యిడెయ — గుర్వుగా దిరుగుచు
గుర్వించుకొనుచు
గరతలంబాని భ్రమనసారి యట్లు — ధర దిరుగుచు వెసల్
దన్ని నిల్చుచును
దర బొమ్మమునట్లు దలక్రిందుచేసి తిరుగుచు వెలిదన్ని
తిపుట నిల్చుచును

### 16 పక్షి మృగముల చేష్టల అనుకరణములు

నెమలియు బోలె మున్నతి నటించుచును – భ్రమరంబు క్రియదాన
బరిభ్రమించుచును
చిలుకయు బోలె జెన్నొలయ బల్కుచును – జలచరంబులవోలె
జనుల కుల్కుచును
కలహంసయును బోలె గతుల నేర్పుచును – నిల మృగ మట్లరిమి
(రిమి) జూచుచును
గండు కోయిలవలె గడగి కూయుచును – వెండి క్రోతియు వోలె
వికృతి సేయుచును
వాలతేదును బోలె నటయిట నసుచు – గోలికాడును బోలె
గోర్మెన గొనుచు
మద గజంబునుబోలె మాఱుమలయుచు (ను) – బొదలి వ్యాఘ్రం
బట్ల పాటినులియుచును
కేసరివోలె లంఘించి పట్టుచును – మాసటీదును బోలె మడి
వేట్టుచును
మహి భుజంగమువోలె మలకలుగొనుచు – విహగంబు క్రియ నభో
వీధిని జనుచు

### 6 విశేష మానుష వ్యక్తుల ననుకరణము

సరి విలాసినివోలె సభమురియుచును వరవిటునట్లు భావము
లరియుచును
గతియట్ల నవరసగ్రాహకుండగుచు – శివయోగి యట్టులు సిఱు
నవ్వు నగుచు
జగతే నృపననట్లు పరిణమించుచును.

### 3 అమానుష వ్యక్తుల (ననుకరించుట) పోలికలు

పొగలేని వహ్నియు బోలె మించుచును
ఛాయలేని వెలుంగు బోలె గప్పుచును – మాయలేని
పూరారిమాడ్కి నొప్పుచును

### దశవిధ శివలీలా నాట్యములు

పురములు గాల్చిన పోల్కి యాడుచును – మరు జిఱుచిచ్చ
మాడ్కి నాడుచును
సతికర్ధ మిచ్చిన చందమాడుచును – యతులు గొల్వగ నెన్న యంద
మాడుచును
సంధకాసురు మదంబడచుటాడుచును – గంగ గణాధిపు గదస్ప
టాడుచును
జన్నంబు ద్రుంచిన జాలినాడుచును – వెన్నం కన్నిచ్చువేళ
నాడుచును
గజచర్మంబు దాల్చిన కరణి యాడుచును – సరిస జాలలగొను సరణి
యాడుచును
వెండియుభవ్వ బహువిధ చరిత్రముల – ఖండితగతి నాటకంబు
లాడుచును

భృంగియు నభిమతప్రీతి నర్తింబు – భృంగులలో దాను
భృంగియై యాడ
గంబళాశ్వతరాది గణాధిపతులు – తుంబురు నారదాదులు
ప్రీతి బాడ.

### 15 అభినయ భేదములు

**మార్గనాట్యపద్ధతి - దేశిపద్ధతితో భరతుని మతములో కలిపినది**

సంగరాగంబు గీతాంగరేఖయును – రంగశోభయు ముఖరాగంబు
దనము.

వితతంబు, నిలయంబు, విగతియు నంస – గతియు, వాపర్తిస,
గ్రహగతి, లవణి,
దేసికొరత నభాధీరధియును, గజాసనంబు. సౌక్కి సళావళి, త్రిపురి,
యపధానమును, సంధియనునొక విధము – వ్యవసాయమును
నిబపిణియు, లంఘితము
దాళి ముఖ యోప తాపనయును, సుతాళంబును, బ్రహ్మనతయు,
వివర్తనము
బయవాటము, లలిత, వసయు, గనిషకయును, నప్పణము
బళయును. గోమళక,
యుల్లాసమును, లలియును, – మనోహరము – దిల్లాయి, దుకాణి,
దేవణి, జింకె
డాలంబు, తివళి, సౌష్టవము, విభ్రమము – జాళి, మొయ్యారంబు,
నరసంబుదన

4 పర్త్రి విభ్రమములు। 7 భ్రూలతాటనములు। షడ్వలశత్క్రమ
మష రంకితము.

10 కర్ణావధానములు, 9 గళముఖోల్లాసములు । 3 పక్షోపవాసములు
5 పాదద్వయ పంచకము । ఊరుద్వయ కరిం పంచకము ।
వింశతి అంగహారములు । బంధి సుగతి, సముభంగ, త్రిభంగ,
యరుదగు 12 లాసకములు

దృష్టిసుదృష్టు । జొషష్టి హస్తములు । బత్తీసువాదులు ।
7 భ్రమరులు

108 కరణములు । 100 అలంకారములు । 13 శిరోభేదములు
32 దండసములు

హంస మేష
మాతంగ మయూర
పృషత భోగి
మర్కట

మొదలైన పెక్కుగతుల నొప్పారు

రంభ యాదిగ నప్పరస్స మూహంబు
గుంభినీ ధవునితో గూడియాడంగ

శ్రీనాథ విరచిత

## పల్నాటి వీరచరిత్ర - బాలచంద్ర యుద్ధము

### నలగామరాజు సభయందు విద్యావిధానములు

( నందికేశ్వర రచిత అభినయ దర్పణమందు చెప్పినట్లు శ్రీనాథుడు రాజసభను వర్ణించెను. ధీరోదాత్తుడు, రసగ్రహణపారీణుడు, సమర్థుడు అగు సచివోత్తమకవి సుహృజ్జనముతో తూర్పు ముఖమున కూర్చుండగా, ఆ రాజునకెదురు నాట్యము చేయవలెను. ఆ స్థలము రంగమనబడును. )

పాక శాసను కొల్వు పగిదినున్నట్టి
వేళ నేతెంచిరి విద్యాధికతను
నాట్యమేళమువారు నవ విలాసముల
వచ్చి నమ్రతమొక్కి ప్రక్కగా నిల్వ
ఘనవైభవంబున కాము భావిభుడు
సవ్యచు సెలవిచ్చె నాట్యంబు 'సేయ'
మన మృదంగము లెన్న వాయించుమేటి
సంధి భాగమున యందు కుదురుగా నిలిచె
తాళ మానజ్ఞులు దాపటి దిశను
నిలిచి యుత్సాహంబు నేరుపు మీర
ముఖవీణ వాయించు ముఖ్యులొకందు
రాగమాలాపించు రమణులిదటను
సందువేడుకతోడ నిలిచిరి వెనుక
రంజనలోచనయను ఘనమైన పాత్ర
మదను పుట్టపుదంతి మంజులవాణి
భరత శాస్త్రోచిత బహురాగములను
గరిమతో నేర్పిన కంతు బాణంబు
వచ్చి సభాసదులు వర్ణించి చూడ
నిలిచి నాట్యమునకు నేర్పరియైన
నేత్ర పాణికి దగు వినయంబు జూపి
అతమానసంగిన గజ్జలతి భక్తితో
పాదములంగట్టి పంచవర్ణముల కో
క గట్టిగ కట్టి కడు జపం బరసి
మద్దెల తాళాల మధ్యనిల్చుండి
ఓర జూపున రాజు నొయ్యన జూచి
సమపాద యుతమైన స్థానకస్థితిని
తాత్పర్యము దేవతలకును మొక్కి
పుష్పాంజలి యొసంగి పూని నాట్యంబు
సమకట్టి నాదంబు సభయెల్ల గ్రమ్మ
కై కోలు విడుదలల్, ఘనకాకాకైలి
కై ముడి కట్నముల్, కనుపింపజేసి
వెంయంగ తొమ్మిది విధములైనట్టి
భూచారి నాట్యంబు పొందుగా సలిపి
పదువారువిధములై పరగిన యట్టి
ఆకాశచారియు నమరుగ నాది
అంగహారాఖ్య గలట్టి నాట్యంబు
విదితమౌ తొమ్మిది విధముల నాడి
గతి, చారి భేదముల్ గనుపడునట్లు
భ్రమణ సంయుత దీప్త పటిమ మెరంగ
పాణి భేదములను పాటించి చూపి
స్థానక సంచయ సంయుక్తి అమర
ప్రేరణి దేశిని ప్రేంఖణ శుద్ధ
దండికా కుండలి తగు బహుచారి
సప్త తాండవములు సల్పె చిత్రముగ
సభవార లాశ్చర్య సంయుక్తులైరి
తరువాత నిరుమేల దగు చెలులమర
సంయుతా సంయుతా చలన సంకుచిత
నానార్థకరములు నాట్య హస్తములు
శిరమును చూపులు చెక్కిళ్లు బొమలు
దంతోష్ఠ కంఠముల్ తగు చుబుకంబు
ముఖరాగ పక్షముల్ మొదలుగ నెన్న
అంగంబులారు ఉపాంగంబులారు
ప్రత్యంగ సముదయం బారునుంగూడి
యెనిమిది పదియగు నెసగు సంగంబు
లమరంగ సభినయం బాశ్చర్యముగను
చూపర్ల చెన్నని మహిమంబు వెలుపు
ఆంధ్ర సంస్కృత వాఙ్మయ గీతము
భావంబు లెన్నగా ప్రకటంబు చేయ
చూచి రంభాదులు చోద్యంబు నొంది
శిరసులు వంచియు సిగ్గును జెంది
ఇట్టి మహామహిమను దొక్క
పత్రభూషణములు వారలకిచ్చి
బోయి రమ్మని పంపించె నిరవ

# నృత్యకళలోని వివిధ సంగీత రచనములు - వాని స్వరూపములు

నృత్య సంగీతమునందు పాడబడే వివిధరకములైన సంగీత రచనములగురించి ఈ క్రింద తెలుపబడినది. ఇందలి వచనములు, కీర్తనలు, పదములు మరియు అనేక విధములైన దేశి సంగీత రచనములు దక్షిణ భారత దేశములో భరతనాట్యము, భాగవత సంప్రదాయము, యక్షగాన సంప్రదాయములందు వివిధ భాషలలో ప్రయోగించబడుచున్నవి:-

1. వ॥ అని ముచ్చటలాడి యచ్చట నప్పుడమివేల్పు జవరాండ్రు కట్నంబులకై కొట్నంబు దంచుచు అమ్మహోత్సవాంగణంబున సువ్వాల పాడిరట యెటువలెను.

సువ్వాల : సువ్వి మోహనాకార సువ్వి భక్తమందార సువ్వి
చెందలంకార సువ్వి ॥సువ్వి॥ 1
దాసవాల దొరలుచూడ పసువులేటి దరులవాడ
దాసకేళి సలుపుమన్న రాజమన్న॥ 2
పాలకడలి రాచపట్టి - దాళిమీఱఁ జేపట్టి
శ్రీలఁజాలఁజెలఁగునట్టి - చెలువమన్న॥ 3
విజయరాఘవునిపీలు - వెలయుచున్న రాజమన్న
గజరాజగమన నేలు - కరుణ మీఱఁగా॥ 4

2 ధవళం : జయ జయ హేమాబ్జ వల్లి
జయ జయ కాంతామ తల్లి
జయ జయ రాజగోపాల
జయ జయ రమణీయశీల
జయ జయ కలశాబ్ధికన్య
జయ జయ భువనైకమాన్య
జయ జయ నందకుమార
జయ జయ మోహనాకార

3 శోభనము : శ్రీ రాజగోపాలునకు
శృంగార విలోలునకు
చారుముఖోల్లాసునకు
చంపక వనవాసునకు
నీలాంబుద వేణికిని
నిత్య కళ్యాణికిని
జాతవా బొమ్మకును
చక్కని చెంగమ్మకును

పై పాటలు 'యక్షగానములు (తంజావూరు)' సంపుటము ౧ నుండి గ్రహింపబడెను.

## 1. రాగమాలిక

1. వరహాంగి రాగం - త్రిశ్రలఘు
సామీ నీపై ఆ సరసాంగియు చాలా మరులుకొన్నదిరా
ఆరటమును మనసువగల
ఆతురలు తెలియ వ్రాసిన
సారసాస్త్రధరుడౌ మదన
శాస్త్రములను నెరచదివిన ॥సామి॥

2. సావేరి
ఏమి సేయుదునని మనసా వేరే
యెల్లప్పుడును చిం
తించుచున్నదిరా
మంచి వితరణ గలది యని
యెంచి సరగున నాపై నెన
రుంచి సదనము కొరకు చను
దెంచి కౌంగళిం చాననుంచె ॥యే॥

3. నవరోజ-
నా మనవి విని
నీ వచ్చితే యది
నవరోజ నీ కౌని
యాడునురా
తామసములను చలుపుట
నీకు తగదుర యల వని
తామణికి సరియెవ పర
మాప్తుదని కమ్మే మరవిదు ॥నా॥

4. లలిత
తామరసాక్షి నీ
లలితా కారమును
తగల జూచుటకు ప్రీ
తియు గవదిరా
గారాబముతో పదముల తీరుగ గొలుచు
జనులకు దురాగ్రహము నిరాకరించి విరావ
శుభ వరాలొసగు ॥తామ॥

5. వరాళి
ప్రేమతో మన
వరాళి యదినను
విలిచి నీవద్ద పొమ్మనె
నురా
కూర్చిర మరుడు విరి శరములు
సారెకును యెదపై గురియగ

వారిజముఖి వలపు మిగుల
మీరి నిను కలయుటకు అతి ॥ప్రేమ॥

6. ఆరభి

భామకు నీ భ్రమ
మముచే మన
సార భిన్న
లేదాని చెప్పు చు
న్నానురా
గాన రసిక శిఖామణియని యశము
గలనీకు సరిసమాన మెవరు
లేదనుచును ఆనదము కానవలెనను

7. కమాను

వేమారు తడజేయక
మా సుదతియొక్క
వెతదీర్చుట కిదె
సమయమురా
దాని గుణము దులుప వశమా
పరమ పురుషవర స
దా నిను మదిలోన దలుచు దా
నిపైన అరమరబడి ॥వేమా॥

8. భూపాలం

భూమిలో వెలయు భూపాలుడని
ఎరిగి....నీరాక కోరియున్నదిరా
మార జనక యల మ
ల య మారుతుడు బహు విసరగ
మనసుకరిగి యిది మరి మరి
నిను మదివేడెర సామిగ॥

## 2. రాగమాలిక-ఆదితాళం

సుదతీ నా మోహ నాంగుని
గారవములు నలుపతగునె సాధారణముగ నీవు దెలిపి॥
తోడి తేవే తేవే – మోహనాంగుని
నా మనసున వెతలను – దెలిపి దయగలిగి వేగమె విభుని॥
క్షితిని వెలయు విందుపురిని వసంతు డౌ॥
అంతాండముల కాధారమగునని మునీంద్ర సురలాది
నరులు పొగడగ
శ్రీ మెఱయు పరిమళ రంగేంద్రుని
క్షీరసాగరమునబుట్టితివని స్థిరముగాను గొలిచిన సంపద
లిడు సారెకును అతని పదమె గతియని చలముమాని కరు
ణించ మనవి విన కవికరమునమిదిగరగి సదయునికి సరసము
ఇది సమయమని దెలిపి సరగున ॥సుదతీ॥

చెలిమి జేసిన మొదలు కళ్యాణి
ఆ చిరుతనాటి మొదలుగనే ఘనతరముగ మదిని – విభుని
చిత్తగింపుమని కావా కోరితి
నామనవి ఏని సారెకు రావలెననుచు అడుగడుగుకును
కలికి దానికే తమసి తెలిసి
సామిగయని పొగడి పొగడినా సదయుడని ఈజగములెరుగు
కన్నడ చేసేది తగునా నాపై
నా మనసెరిగి రతుల పగలన్ జరిపింప తగినవానికి
వలరాయని శారంగముల శరము
కోకిలలుగూయ మఱిమఱి నాసరి, సకులు విని సతతమును
వచ్చిపోతావా బహుళా నిన్ను వేడితి
నే దిగులు పొందినది విని విరికరంబు లురమున
సొలపుమీరి విరహాంబుధిలో
అనాటి సరస విధముల నామది భ్రమసి సదాతలచగ
సొక్కితినే జవరాళి వినవే
నా సరసుని నే తలచ అతని సురత కేళిలో మది తగిలి
అల సౌరాష్ట్ర దేశమున
ఈ జగములలోపల మిగులా సరసుల కనులకు సొగసుగ
దానలో చిక్కిదరు పారు వెతలని
నాసరిసఖులు వాని విభునీ ఇటుల చలమెనగ జే పి తె
పలుకరించి నాదు కోర్కెల నీవు పక్షమాలికాభరణ భూపా
లునిగ నీమది కఱిగి ఇటులవగలన్ సరసుని తెలుగ
లలితముగ

భూ– సారెకును విటుల వగల తగని
ద– సరోజముఖియిది తెలుపవె వానికి
సా– వలచితినని విరిబాణము చేకొని
వ– మనసిజుండిదిగో మిగుల గాచెవని
కాం–పలుకక విని మది విరాళి గొంటిని
ఉ– ఇదే సమయం మని రంమనవే
సా– ఇకను నాదు తాపము తీరదు విను
క– వచ్చినన్ను కౌగలించి వేగమే
కే– కదియగ పెనగొని చాల వేడ్కతో
శ– తా నధర మధురామృతం బొసగే
క– సదా ముదమునను గలయుటకు విభుని
మో–సరకునిది సమయమని తెలిపి సరగున ॥సుదతీ॥

## ప్రహ్లాదచరిత్ర - యక్షగానము

శుక్రకుమారుని వాక్యం : కర్త : విజయరామవుకు

ద్విపద : దనుజేంద్ర, హర్షమెంతయు నయ్యెనేడు
దినము మంచిది తోడి తెప్పింపు డతని
పదునాల్గువిద్యల ప్రావీణ్య మమర
జదివింతు నీమది సంతోష మొదవ

### ఏ ల పా ట

ఊంజలి (ఊయల)

శ్రీరంజిల్లు । కౌసల్యయందు
చెలగి యాశ్లేకేసుssssమిత్రయంssssదు
మేలిమిగా లక్ష్మణభరత తోssssనూ
మేటిమిగా శత్రుఘ్ను లోవనింప
భూలోకమున జనులయింట బుssssట్టి
పుణ్యుడై దశరధుని యింట బుssssట్టి

* * *

ఏలేssఓssssssరామ జయం sss
శ్రీరామం
ఏలేssఓssssssస్వామి జయంsss
శ్రీరామం
నీల నీssssరద రుచిరం
శ్రీరామం
నిత్యకssssళ్యాణ కరం
శ్రీరామం
పాలిssతssssసుర నికరం
శ్రీరామం
పరమ విssssలాస కరం
శ్రీరామం

గతి ఖండ
కేళివిలోలం
కేలావ శ్రీలం
పాలన లోలం
భజన శ్రీలోలం
పాల సాగరమందు
ఏల జాడుచును
పాలుని పోలిక
కాతి బొటనవ్రేలు
వాలాయముగ నోట
నొవర కిలించి
లీల మత్యాకుతో
చాల పవళించె
మేలిమి తోడుత
మెల్ల పరికింపుచూ
కేళీవిలాసుడై
క్రీగంటి చూపుల
పాలన చేయుచు
పరగసంతోషించి
బాల శ్రీరాముని
ప్రణతులు సేయరే } మిశ్రము
ఏలేsssఓsssss
రామజయం sss
శ్రీరామం

రాసక్రీడ :- కృష్ణ కర్ణామృతము నుండి

శ్లో॥ అంగనా మంగనా మంతరే మాధవో
మాధవం మాధవం చాంతరే చాంగనా
ఇత్థ మాకల్పితే మండలే మధ్యగో
సంజగే వేణునా దేవకీ నందనః ।

* * *

విప్రనారాయణ యక్షగానము నుండి

కురంజిరాగం, ఝంపెతాళం, త్యాగిమావం

పాడుకు నూఱు బావిల నీరు
చేదితే పొదలు చేమంతి పొదలు.
పండె గోపాల పెండె గోపాల
పెండు చేకొన్న శ్రీరాజమన్న॥
చలువలచేరు సంపంగిపెరు.
కాల్వలకే నూఱు కడవల నీరు
విరజాజిపొదలు వికసించె నేడు
సురిపొన్నలు సొంపురాజించె
మల్లెలు పూచె మగతేటి జొచ్చె
మొల్లలు చిన్న మొగ్గలువెచె
పొన్నలు పెరిగె పొగడలు బొదలె
సన్నజాజులకు సమయము వచ్చె
ఎలదోట విరులు హేరాళమాయె
ఫలమిచ్చి నన్ను బనిగొనవయ్య

జతి - కైవారం

తరుణీ జన కుసుమ సాయక
తంజాపురీ నాయక పరాకు

### అష్టకం

రాజముఖి వినవమ్మ చక్కని
రాజగోపాల చంద్రుని
రాజసమ్మున తోడితేగదే
రతుల యీరేయి గూడను
తేజమున సరిలేక మించిన
దీనజన మందారుని
భోజరాజ తనూజ నేలిన
ఘనుని మోహన గాత్రుని॥

### చూర్ణిక

శ్రీ చంగమల వల్లి మనోహరాకార!
చారుతర మాణిక్య గోపుర ప్రకార!
సమస్త దైతేయ కమల వన వేదండ!
సంభృత శార్ఙ్గ కోదండ!
సంతత దక్షిణ ద్వారకావాస!
శారదచంద్రచంద్రికాహాస
రక్షిత చోళ భూపాల
శరణం తవ చరణ రాజీవయుగళం భజేహం.

వెల్లూరి నరసింహదాసు విరచిత కాళింగ మర్దన యక్షగానంలోని

### చల్లలమ్మే దరువు

చల్లోయమ్మా చల్లా। గొల్ల చల్లో యమ్మా చల్లో।
చల్లగొనరె। సఖులెల్ల ముదంబున ।౩।
ముల్లోకముల। కెన్నికగల గొల్ల ॥చల్లో॥
పెరుగోయమ్మా పెరుగు ॥మీగడ॥
పెరుగోయమ్మా పెరుగో।
మురియుచు వృద్ధులు। భుజియించు నప్పుడే ।౩।
త్వరగ యప్పనము దాల్చెదరే గొల్ల ॥చల్లో॥
పాలోయమ్మ పాలూ। దేను పాలోయమ్మ పాలో।
మేలిమి కసివగ బిగిబిగి గల్గు గొల్ల ॥చల్లో॥
ఘృతమోయమ్మ ఘృతము। కమ్మని
ఘృతమోయమ్మ ఘృతము।
అతివలకై నను మతిగల్గును యీ ।౩।
క్షితి చక్రపుర వరపతికి తగిన గొల్ల ॥చల్లో॥

### నాట్యసాహిత్యంలో ఉపయోగించిన స్త్రీ పర్యాయపదములు

| | | |
|---|---|---|
| నెలత | శృంగారవతి | మెలత |
| చెలువ | కప్పురగంధి | బాలిక |
| చంద్రాస్య | లలన | వేదండగమన |
| వాన | మగువ | కమలాక్షి |

| | | |
|---|---|---|
| కలికి | లతాంగి | జవరాలు |
| కనకాంగి | కోమలాంగి | వారిజాక్షి |
| హేమాంగి | కంబుకంఠి | కంజాక్షి |
| జాణ | కుందరదన | అలివేణి |
| సకియ | ఇందువదన | వనిత |
| తరుణి | ఇందుముఖి | వెలది |
| వనిత | పూబోణి | కాంత |
| పడతి | మృగాక్షి | పడుచు |
| కొమ్మ | మదవతి | పట్టి |
| చెలువ | తరళాక్షి | మేచక కచ |
| తలిరుబోణి | జలజాక్షి | నీరజముఖి |
| రామ | కలకంఠి | మీనలోచన |
| చామ | వనజగంధి | కామాక్షి |
| ఉవిద | వనజముఖి | కోమలి |
| సుదతి | పొలతి | రమణి |
| మదిరాక్షి | వెలది | కాంత |
| ఇంతి | ఎలనాగ | పొలతి |
| విరిబోణి | భామ | జవ్వని |
| పల్లవాధర | భామిని | కొమ్మ |
| శతపత్రలోచన | మత్తకాశిని | చిలుకలకొలికి |
| తోయజనేత్రి | మచ్చెకంటి | సన్నుతాంగి |
| చందనగంధి | పద్మనయన | జలదవేణి |
| అతివ | నీరజలోచన | పణతి |
| వనజలోచన | పద్మగంధి | రాజీవనయన |
| కాంత | తామరసేక్షణ | మంగళాంగి |
| గజయాన | కన్య | లోలలోచన |
| కరిరాజగమన | నెరజాణ | చిత్తరి |
| మరాళగామిని | కుటిలకుంతల | లలితాంగి |
| రాకేందువదన | వాలుగంటి | తొయ్యలి |
| నీలవేణి | మందయాన | మదావళగమన |
| కలికి | చంచలాక్షి | |
| పంకజమృదుపాణి | చపలాక్షి | |
| విమలాంగి | మగువ | |
| వామాక్షి | నళినాక్షి | |
| తొయ్యలి | జవ్వని | |
| అంగన | మించుబోణి | |
| సంపూర్ణచంద్రాస్య | రమణి | |
| విలాసవతి | నసబోణి | |
| రాజవదన | ముదిత | |
| ఇందీవరాక్షి | కొంచెగత్తె | |
| మెచ్చులాడి | వన్నెలాడి | |
| నారీమణి | హరిణాక్షి | |
| మెఱుగుబోణి | లాపంచక్షి | |

### చమత్కార రచన

చ॥ చిగురుల తూపులన్ గల వశీరుని తల్లికి
తోడ బుట్టువున్
తగ తలదాల్చు వాని మెడదండల తిండి కుమారునిన్
ధ్వజం
బగ గొమవాని ప్రెమసతి పుత్రుని తాత విరోధి
తాతనున్
జగమెఱుగంగ నేలు జలజప్రభ నేత్రుడు
బ్రోచు నెప్పుడున్

టీ॥ తేత బాణములు గల సిపాయి మన్మథుడు।
మన్మథుని తల్లి లక్ష్మి। లక్ష్మి తోబుట్టువు చంద్రుడు।
చంద్రుని ధరించినవాడు సదాశివుడు।
సదాశివుని హారములు సర్పములు।
సర్పముల కాహారము వాయువు। వాయువుకొ
డుకు ఆంజనేయుడు। ఆంజనేయుని జండా
ధరించినవాడు అర్జునుడు। అర్జునుని సతి
సుభద్ర। సుభద్ర కొడుకు అభిమన్యుడు।

అభిమన్యుని తాత యింద్రుడు। ఇంద్రుని వైరి
బలిచక్రవర్తి। బలితాత ప్రహ్లాదుడు।
ప్రహ్లాదుని రక్షించినవాడు నరసింహుడు।
అటువంటి నరసింహుడు మిమ్ము రక్షించు నెప్పుడున్।

**ఊదవాక్యకవిరచిత**

### గరుడాచల నాటకము

ఎరుకత తావచ్చెను। అవ్వోయవ్వా
ఎరుకత తావచ్చెను॥
ఎరుకత తావచ్చే। ఏడేడు భువనాలు
మరువక నెరువకయు। మరివేగ జెప్పుచు॥

నవరత్నములు దాపిన
పెట్టియువేగ। నయముతో శిరమందున
భువన మోహితురాలు।
పుణ్య చారిత్రియు।
అవనిలో జనులంత।
అమ్మేరమ్మని పిలువ॥

పంచరంగుల చీరయు।
మధ్యంబున కంచుకంబును దొడగియు
పంచబాణుని చిలుక
పరమ కల్యాణియు
యెంచ శక్యముగాని। వెలదులు కొలువగ॥

మణిమయ హారంబులు
కాళ్ళందెలు ఘనముగా
మ్రోయగను
మాణిక్య। ముత్యాలహారము
కోభిల్ల। వేణి జల్లాడ
విరులాడ। బంతులుజారి।
బాలుని దానెత్తుక। భద్రాద్రేశులీలలు బహునేర్చుక
లోలాక్షి కమలాక్షి లోకమాతయని
పాలాక్షి సతిసుత పరమకల్యాణి॥

## సింహళ నృత్యమందలి పల్లవులు - వర్ణములు

**1 గజ**

దొమికిట తకదొము
తేక
దొనుజినుగ త్తకు గజిగత ధోంతక॥
తనం। తానతు తందోన తందనా నతు
తిందోన తంద నానతు తందన తందన తాన
తరిక। గజితకు జిత్తను
కస్తిర తరికిట జితు తిరికిట జెమికిట తా॥

**2 వయియాది**

ధోం జిం జిం తకిట దొము తక
తనం। తోంతెనెనము తెనెనము తెనె స స
తెనక తెనము తెనెనము తెనెనానా
తరిక
కస్తిరా } తకట తతు జితు తకట కుదతరి జితు, ధోం దీత్తము

**3 కిరల** (పుడ్ పెక్కరు)

దోం జిం జిం తకిట దోంతక
తసం। తందన తాన్ తన తన్ తందస
తందన తాన్ తన
తెయి తన్ తాన్ తన తన్
తందన-తైయి తన తాన తన
తరికి తకట తజ్జితు తకట క్రుదతిరి జితు

**4 యిరాది**

తాళ॥ గత్తకు క్రున్దతు జిం
తనం। తనన తనత। ననగ తనత
తనన్ తననా। నాత్ నన
కస్తిర॥ తంగోగతు। తక తోం గతు
తక తరికిట। తక తోం గత్తై యి॥

5 ఉదర

తాళ॥ ధోం జిగత్

తనం। తందన తందాన తందనాన

తము దన తన తందాన తందనాన

తత్తోంగతు తక తోంగతు తెయి

(లేక) కుద గజి జిత్తా

* * *

6 సింహరాజ

మాత్ర– ధోం జిం జిం తకిట ధోం తక

తనం– తమతు తనెన తము। దనతు

తనతు తందనతు తనెన తము

దనతు తనతు తన

– తకట తజింతు తకిట కుద తరి జితు

7 హంసమ

మాత్ర– ధోం జిం జిం తకిట ధోం తక

తనం– తనము దినతు తందనత తనము

నన్। తనముదనతు తెనెన– తెయి।

తనందనతు తందనతు తనందెన

తనము దెనెతు తనెన

తియా। తకట తతు జితు

తకట క్రుద తిరి జిత

8 గణపతి

మాత్ర– గత్తకు క్రును దతు జిం।

తనం– తము దనము దన తన

తాన్ తనముదన తన

తాన తన తందనతము దన తానా

తియా। తతు తోను గతు। తక తోను గతు

తక తరికిట తక తోం గతు తైయి

9 నవుల

మాత్ర– తైయి తైయి తతు తతు తరికిట॥

తనం– తము తందన తనము। దన

తందన తనము తము తందన

తాన తైయి తంద్యాన తందనన

తియా– తతు తరికిట జి తరికిట

క్రుద తరికిట జిత్త॥

10 గహాళ

మాత్ర– ధోం జిం గత్తకు గజిగత ధోం తక॥

తనం– తమ తందనా తందనా తందనన

తైయి తన తందన తందనా తందనన

తియి॥ తైయికిత కిత తతు

తరికిట కితతక గజ్జతు తకజతు

తజ్జతు తోన్నను తా॥

11 వైరోధి

మాత్ర॥ గత్తకు క్రున్ దాతు జిం॥

తన। తందన తందన తందన తన

తాన తైయి తానతైయి తాన తైయి తాన

తందన తన తానతైయి తనము

ధన తందెన తానతైయి తంద్యాన తందనాన

తియా॥ తతు జితు తతు। తక జితు తక

తక తరికిట తక జిత్తుక ॥తై॥

12 మయూరి

తాన– క్రుద క్రుద గజితు గత్తతు తకిట

తనం॥ తనెన తన తన తనెన తన తన

తనెన తన తానా – తినెన తిన తిన

తినెన తిన తిన తినెన తిన తినెనా

తియా॥ క్రుద క్రుద గజితు। క్రుద క్రుద గజితు

క్రుద క్రుద గజితు। గతు తితు

తకిట। తరికిట జెమికిట తా –

13 తురగ

తాళ– ధోం ధోం గజితు జిగత

తనం– తతు తతు తనతు తనెన

నతు తతు తనతు

తనెన తత్తతు తనతు

తనెన తానా – తన తనెన తన

తనెన తనె నతు తనతు తందనతు తందనానా

తియా। క్రుదగజితు। క్రుతగజితు।

క్రుతగజి। జిత క్రుదను॥

14 మరపతి

తాళ– ధోం జిం జిం తకట ధోం తక్

తనం– తన నతు తందన త నందన

తందనతు తందాన తనతము – దన తందనాన

తియా। తకట తతు జితు। తకట క్రుద తరిజితు

15 మునలాడి (చెవులపిల్లి)

తాళం– ధోం జిం జిం తకట ధోం తక క్రుద క్రుజిగత

తనం– తావత్త తావత్త తానము । తంద
నావత్త తనెనత్త తానము –
తన త్తనెన తనెన తనెన
తానెన తందాన తనెన । నానత్త
తనె నత్త తానము
తియః తకిట తకు జితు తకట
క్రుద తరి జితు॥

**16. ఉదువ**

తాళ॥ దొమికిట తకదొము
తనం॥ రానా తా నెనము తానతు
తనెనతు తందన తానతు । తనెన తనెన
తంపెనతు తానతు – తానా తనెనము
కత్తీర॥ గతు జితు తకజితు
గజ్జితు తోన్నతా॥

**17. ఉరద**

తాళం– క్రుద క్రుద గణను గత్తతు తకట
ధోం జిం జిం తకిట ధోం తక
తనం– తందానరెన తాన తనము – తమద నాన
తనాన తనాన తనాన తనాన తనాన తనము
తంద నావ తనాన తనము
తియ॥ క్రుద క్రుద గణను క్రుద
క్రుద గణను । క్రుద క్రుద గణను
గత్తతు తకిట తరికిట జెమికిట తా

**18. అహాద్రన**

మాత్ర– తక్రు దను తతు తరికిట కిటతక
తెయి తకట తక తెయికిట తెయియతు
తెయి తాతెయి యతు తెయికిట కిటితక
తనం– తానము తందాన తనెన తంద । నానము
తందాన తనెన తంద (నానము)
తందాన తనెన తంద ।
తియ– తర తక తిరికిట తకు జెంతా॥

## సుందరేశ్వర విలాసము

### కవి – చెయ్యూరు చెంగల్వరాయ

( వెలుగు మీనాక్షిని భర్తపేరడుగగా చమత్కరించి చెప్పుట )

సీ॥ ఇభరాజగమన నా విభుని పేరడిగేవు
వినవమ్మ చెప్పెద వినదముగను
తల్పాయగా చేయదగు పాముపేరేమి? (వాసుకి)
కడలిద్రచ్చిన గొప్ప కవ్వమెద్ది? (మందరం)
పూలతేనియలను గ్రోలెడు పురుపెద్ది? (ద్విరేఫం)
యరదంబునకు ముందు పరచునెద్ది (అశ్వము)
ఇలునిండ వెలుగందగల భూషణంబెద్ది? (తరుణి)
విఘ్నేశ్వరునిచేత వెలయునెద్ది (కుడుము)
తే॥ గీ॥ అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
మధ్యవర్ణంబులందు నా మగనిపేరు
గానబడుచుండునమ్మ యావైనమరసి
అందరికి తెలియబల్కవే సుందరుడని ।

## క్రీడాభిరామము – వల్లభరాయకవి

### చలి – ఆంగికం – సాత్త్వికం

ఉ॥ ప్రక్కలు పంచిపంచి మునిపంట్లను పంట్లను రాచిరాచి తా
మ్మక్కిల జేసిజేసి తలయల్లను కాళుల సందిసంది లో
చక్కికి నొక్కినొక్కి యిడుచంబడ గుప్పుడి మూటగట్టి పి
పెక్కు దువాళిచేసి చలి యిక్కడ నక్కడ దెబ్బ పేకువన్

1. వంచు 2. రాయు 3. జేయు
4. సందు 5. నొక్కు

### పుష్పస్తబకాలు

మద్దిరాల వేంకటరాయ విరచితము

శా॥ శ్రీరంజిల్లగ గౌరి సన్నిధిటికిన్ శ్రీఘంటునం బంపెరా ;
కారుణ్యంబున జూచి నామనవి హృత్కంజంబునన్ జేర్పరా;
తా రూఢంబుగ పల్కుమన్న పలుకుల్ తథ్యంబుగాపల్కెదన్
సారస్యంబిదె చూడు పీఠపురివాసా ; కుక్కుటేశా ; భవా ;

దరువు: శ్రీ సితాద్రినివాస ; వాసవ సేవితాంఘ్రి సరోరుహా ;
పాశహస్త మదప్రశిక్షణ ; భక్తవత్సల వీక్షణా ;
భూ శతాంగ ; శివా మనోహర ; పూర్వ యోగిని సేవితా
కౌశలంబుగ కుక్కుటేశ్వర ; రాంత నిన్ పిలిపించెరా ;

### అర్ధ చంద్రికలు – కందార్థము

మద్దిరాల వేంకటరాయ విరచితము

శ్రీ కుక్కుటేశ మూర్తిని
నీ కౌగిటిలోన నుండ నేనేమైనా
చేకొని తీసుకు వస్తిన
రాకుండా నాట్యమేయ – రాదాటె గౌరూ ॥అట్ల॥

దర్వు– రాదాటె గౌరు మ – ర్యాదా మెలుగవు నాతో
వాదేలా పోపోవే – కాదందు లెవరైనా ॥రాదాటె॥

నారీ మణిరో ; వినవే
కోరికతో సామి నన్ను గూడిన పిదపన్
కూరిమి మరువక నీకున్
సారసముఖి ; వేడ్క బన్నసరము లిచ్చెదనూ

త తక ధణం తరికిట–ధాకిట తకఝుం తరికిట
తక జా హత దికితక–తధిమిత కిట–తక ఝుణుతక–
ధిమి తధిమిత తక దధిగిణతోం
(ఈ విధముగా ఏడు తాళములలో రాసక్రీడా వర్ణనము నారాయణతీర్థులు రచించినారు.)

## నవరసములలో ఉపయోగించవలసిన రాగములు

1 శృంగారరసము– మలహశ్రీ, మధ్యమాది, పంచమ, దేశపాళి, మేఘ, కుకుంభ, మలహ, శ్రీ, హిందోల, సైంధవి, గుజరాతి, గౌండకి, తోడి, జయశ్రీ, ప్రహమంజరి, నాట, మల్లార, ఛాయ, లలిత, ద్రావిడ, గౌర, సింధూర, బేలావలి, కర్ణాటగౌర, ధనశిఖ, బర్హారి, సుస్తవి, హుంజిక.
2 వీరరసము– నాట, సైంధవిక, బేలావలి, ధనశ్రీ, శ్రీ, గౌరి, గౌర, మేఘ, సోమ, ధన్వశిఖ, మేఘరంజి, తోడి, దేవకృతి, శంకరాభరణ, హిందోళ, దేశక, ఛాయ, లలిత, భేదగుప్త, ద్రవిడగౌర, శ్రీకాంతిక, తార, మాళవగౌర, దేశపాళి, మలహ, నాగధ్వని, తురుష్కగౌర, గౌరసారంగ.
3 కరుణ– సావేరి, కామోది, రాంకలి, అసావేరి, బేలావలి, సైంధవి, బంగాళ, దేశి, కౌశిక, భూపాలి, గాంధార, జయశ్రీ–
4 హాస్యరసము– కౌశిక, కామోది, శంకర, బంగాళ, నాట
5 రౌద్రరసము– తురుష్కగౌర
6 భయానకరసము– మల్లార
7 బీభత్సరసము– పుళిందక
8 అద్భుతరసము– నాట

## కూచిపూడి 'దశావతార శబ్దం'

మోహనరాగం – తాళం మిశ్రచాపు

**మత్స్య**

తగధీంత, తంహత ధీనుత
తద్దీనుత, తానుఝు ణంతరి
తఝుంతరిత, తఝుం ఝుంతరిత
తఝుంతరిత, ఝుంతగ రేకిణి
తదికు డిడికు, డిడిడికు డింకుకు
తక్కిణనగ తకుందరి కిణనగ
తకుంద, దికుంద, తకుందక్క దికుందక్క
మత్సరముున (మరి) అంబుధిలో
జొచ్చియున్న సోమకు ద్రుంచియు
విచ్చలవిడి వేదము లజునకు
విచ్చితివా మత్స్యావతారా....

**కూర్మ**

తఝుణుతా, తద్ధిది తకుందధి
పలువురు నిను బ్రస్తుతి చేయగ
చెలగి సురలు జలధి మథింపగ
కలిమి బలిమి యలమితో నొసగిన
కులగిరి ధర కూర్మావతారా....

**వరాహ**

కుకుంధరి కిట ధరికిట కిటతక
స్థిరముగ ధరనురువడి చేకొని
ఉరుగ పథము యిరువుగ జొచ్చిన
హిరణ్యాక్షు బరిమార్చితివా
వర సుగుణా వరాహ రూపా....

**నృసింహ**

ధం ధం ధణా – ధిం ధిం దీమి
ధం ధం ధణ – దాణుత డింకుకు
జంభారి ప్రముఖ సుర కదంబంబును రక్షింపంగా
స్తంభంబున వెడలియు (సభా)
దానవ డింభకు బ్రోచితివా
నృసింహా....

**వామన**

తద్ధణాంత, తాహత ఝుంతరి
మానితముగ ముల్లోకములను
జానొప్పగ కాపాడంగా
పూనుగ మూడడుగులు బలిచే
దానముగొని వామనరూపా....

**పరశురా**

తరిమి తరిమి తకదిమి జణుతిక
పరిమి తరిమి ధరణీ పతులను
పరకుపుచే నురుమాడితివా
వరవీర పరాక్రమమున ధర బరగితివా
భార్గవరామా....

**రామ**

జగ జగణకు, జగణకు రేకిణ
దశరథ తనయుడవై సురలకు
వశముగాని దశముఖు ద్రుంచియు
విశదంబుగ అయోధ్యకు సీతతో
వేంచేసితివా, దశరథరామా....

బలరామ

తరిత తరితధణ, ధణత ధణతరుఝ
యాదవ వంశాబ్ధి సుధాకరు
డాదిదేవు డనుజుడుగా ఘన
హలమునుగొని ఖలులను ద్రుంచియు
మేదిని భరముడిపిన బలరామా....

బుద్ధ

తరుంకిట, ఝంతగ రేకిణి
అంగనలను సిగ్గడలించగ
అంగజ సమరూ: మునను
రంగుగ పురకాంతల ప్రతిములు
భంగపరచు బౌద్ధావతారా....

కలి

కిటతక ధెగ కిర్రట తకధెగ
నాటపు కలి బాధల నాపగ
నీటుగ కరవాలము బూనియు
ఘోటకమునెక్కి దురాత్ముల
గీటడచిన కల్క్యవతారా....
సురలు మేల్ మేలని పొగడగ
నిరతము నీ దాసుల బ్రోవగ
పరగ వ్యాఘ్ర పురమున వెలసిన
వరదరాజ దేవా....
ఆశ్రిత సుర భోజా....
దిక్సలాం....దిక్సలాం... దిక్సలాం....

జతి

ధృగుడు తతకిట ఝంత (తరి)
ధణ తధణాంధిమి తదణాంధిమి
ధృగుడు తతకిట తతకిట తక
ధృగుడు తతకిట తలకిట తక
ధృగుడు తతకిట తక తదిగిణతొం
ధృగుడు తలకిట తక తదిగిణతొం
ధృగుడు తతకిట తక తదిగిణతొం....

# తమిళనాడులోని శాస్త్రీయ నృత్య కళాస్వరూపము

భరతనాట్యము, భాగవత సంప్రదాయంగాక ఇతర ప్రాచీన నర్తన రీతులు :-

ద్రవిడ దేశంలోని శాస్త్రీయ నృత్యకళాస్వరూపాన్ని రెండు విధములుగా తెల్పవచ్చును. తెనుగు నాయకరాజులు ద్రవిడ దేశమును పాలించక పూర్వమునాటి నృత్యకళాస్వరూపము, తరువాత వృద్ధిచెందిన నర్తన రీతి.

భరతనాట్యము భాగవతనాట్య మేళము ఈ రెండునూ, అచ్యుతప్ప, రఘునాధ, విజయరాఘవ నాయకుల కాలంనుండి అభివృద్ధి చెందిన కళారూపములు–

రాజరాజచోళుడు యిత్యాది ప్రసిద్ధ రాజులు, రాజవంశములు తమిళ దేశమును పాలించిన నాటి కళారీతులగూర్చి 'సంఘం' కాలంనాటి తమిళ గ్రంధములో వర్ణింపబడినది. 'కవిత్తొగై' గ్రంథములో శివతాండవముగూర్చి వివరంగా తెల్పబడింది.

కొడుకొట్టు, పండరంగం, కాపాలి, నర్తనముల్లో శివుని నర్తన విన్యాసాల గూర్చి వివరములు తెల్పియున్నారు.

ఈ నాట్యముల యితివృత్తము, ప్రదర్శన క్రమము తెలిసికొనిన యివన్నియు ఉద్ధత, గంభీరభావాలతో గూడినట్టి కరణాంగ ప్రదర్శనములేనని. అభినయ, నృత్య, నృత్త విన్యాసములు, వికాసంతో క్రమపద్ధతిలో ఏర్పాటుచేయబడిన కేళికమాత్రం కాదు – రాజరాజ చోళునికాలంలో యెందరో నర్తకీమణులు బృహదీశ్వరుని ఆలయంలో నృత్య పూజచేసేవారు; కంచిలోని, ఆలయాల్లోకూడా నృత్యపూజ వుండింది. ఆరాధనకేళికా రీతి ప్రాచీనమే–

తమిళదేశంనేలిన చోళ, చేర, పాండ్యరాజుల, రాజ్యాలచరిత్ర సాంఘిక జీవనంగూర్చి, కళలగూర్చి మత రాజకీయ విషయాల గూర్చి ఆకాలంనాటి సంఘం, సాహిత్యం తెలుపుతోంది. నెడుంజెలియన్ అనురాజు మధురనురాజధానిగా పాండ్యరాజ్యాన్నేలినకాలంలో 'శిలప్పదికారం' గ్రంధం వెలుగుజూచింది. నృత్య సంగీత సాహిత్య లలితకళలపోషకుడు, ఆరాధకుడు సేరన్ సెంకుట్టువాన్–చేరరాజ్యం పాలించునప్పుడు శిలప్పదికారం రచన జరిగింది–శిలప్పదికారంలో మాధవి అనేనర్తకి యెన్నోవిధములైన నర్తనములనభ్యసించినట్లు తెలుపబడింది. ఆకాలంలో నర్తనం–"కూత్తు" అనిపిలువబడింది– యుద్ధానికి బోవురాజులు, సైన్యములు ద్రవిడదుర్గను పూజించి యుద్ధభూమికివెళ్లేవారు. విజయప్రాప్తికై దుర్గారాధనలో అనేకములైన తాండవములు ప్రదర్శించేవారు – యాల్ అనే సప్తతంత్రి వాద్యము విశేషప్రచారంలో వుండింది.

శిలప్పదికారంలో నాట్యాచార్యునియొక్క పాండిత్యప్రతిభను గూర్చి యీవిధముగా వర్ణించియున్నాడు.

**ఆచార్యుడు :** 'అహికూత్' భేదాల నెరిగిన భిన్న పద్ధతులందు ప్రవీణతగల్గి పదునాల్గు విధములైన విశుక్కులతో మేళవించుశక్తి కల్గియుండవలెను. ఆకాలంలో ప్రచారములోనున్న ఏకాదశనాట్యాల్లో పాండిత్యం కల్గియుండవలెను.

'కూత్' — అనగా నాట్యమని అర్థము.

తెనుగులో ఆట — అని ప్రయోగించినట్లు.

ఉదా — కచేరిఆట, దర్బారుఆట, భోగంఆట, భాగవతపుఆట, యిత్యాది ప్రయోగములున్నట్లు తమిళంలో అభినయకూత్, తెరుకూత్, యిూ విధంగా చెప్పబడును.

## ప్రాచీన నర్తన రీతులు

'ఇశై పుగల్ వెట్టియాళ్'; — రాజుల ఆస్థానములందు ప్రదర్శించవలసిన నర్తనములు.

"పొదువియల్" :— సామాన్య ప్రజల వినోదార్థము చేయబడే నాట్యము.

"వరై, వారిసంతి, వినోదం, ఆర్య, ఇయల్ బు, దేశి—మరియు 108 శివుని కరణములు, వానిచేరికలతో ఏర్పడే అంగహారవిన్యాసముల నర్తనం "చొక్కం"

"కుంపై" అనగా కుంపంజి — ప్రేమకథను ఇతివృత్తంగా కల్గినట్టి ఆట — ప్రయోగించు కవితారీతి — 'కుంపై' ఛందస్సు — తెనుగువందలి త్రిశరగడగతి, ద్విపదరీతి వంటివి

దొమ్మరుల ఆట తీరుకు 'శాశినాట్య' మందురు. శిరస్సుపై నీటికుండ పెట్టుకొని నర్తనము సల్పుట 'కుడం' ఆట విన్యాసం.

స్త్రీలు చేసే లలితనృత్త రీతి — 'నోప్కు' ఈ దేశి విధానాలు గూడా ఆ కాలంలో ప్రచారంలో వుండినటివి.

"విదూషకకూత్" — హాస్యరసాన్ని పోషించే ఆట. మన దేశంలోని సింగి సింగడు, చోడిగాడు, భాగవతం ఆటలో మాధవి పాత్ర వంటిది. నృత్యాభినయ సంగీతములను గూర్చి తమిళ దేశంలో వెలువడిన లక్ష్య లక్షణ గ్రంథాల్లో పంచమరపు, భరతసేనాపతీయం, నాటపి, తమిళనూల్, ఇంద్రకావ్య, ఈశైవనుక్కం ముఖ్యమైనట్టివి —

సూత్రయుగంలోను వెలువడిన మురసల్, గుణనూల్, జయంతం, శైత్యం; అగస్త్యం, కురుగు, కూత్‌నూల్, తలవగై, పంచబరతీయం, బరతం యీ గ్రంథాలన్నీ ద్రవిడదేశ నాట్యకళను గూర్చి తెలిసికొనుటకు ఉపయోగపడును —

కల్యనర్తనం, కుడనర్తనం, కాళీనర్తనం, నటరాజనర్తనం, సీత రావణనర్తనం, యివన్నీ ప్రాంతీయ నర్తనములే — వీటికీ కచేరిఆట (భరతనాట్యానికి) సంబంధంలేదు.

## ఏకాదశ నర్తన రీతులు

అలియం, కొడుకొట్టు, కుడై, కుడం, పేడి, కడయం, మల్, పండరంగము, మారపద్మ, మరక్కాల్, పావై —— నృత్యములు

శిలప్పదికార కవి — నర్తకులు, నాట్యాచార్యులు శిక్షణ విధులన్నియూ నాట్యశాస్త్రమునందువలె వివరంగా చెప్పియున్నాడు. గాని వానిని ప్రయోగించి రూపొందించబడినట్టి నాట్యరీతులు మాత్రము అంతటి ఉదాత్తతతో నూడి ఉన్నట్లు తోచదు.

ఉదాహరణకు యిచ్చట కొన్ని నృత్యములగూర్చి తెల్పుతాను.

కాళితోగల్ అనే సంఘం కవితలో వర్ణించబడిన శివ నర్తనములు మూడింటిని గూర్చి వివరములు — కొడుకొట్టి పాండురంగ, కాపాలి, రుద్రభూమిల్లో శివుడు ప్రళయాంతమందు నర్తన మాడినాడు. జగన్మాత కాళికాదేవి తాళం వేసినది — ఇదే కొడుకొట్టి నర్తనం.

త్రిపుర సంహార అనంతరము ఆనందంతో శివుడు నర్తన మాడినాడు— అప్పుడు ముజ్జగముల తల్లి ఉమ తాళధారియైనది. ఇదే పాండురంగ నర్తనం.

బ్రహ్మదేవునియొక్క ఐదవశిరమును ఛేదించి దాన్ని తనచేత ధరించి శివుడు విజయతాండవమాడగా, అర్థాంగి పార్వతి అతని వెంట నుండినది — ఇదే కపాలి నర్తనం.

ఇందు వర్ణనలు వేరు — నేటి కాలంలో తమిళ నర్తకులు ప్రదర్శించే శివతాండవములు — నటనం ఆడినారు — ఆనంద నటనం ఆడినారు — కాలై తూక్కి — ఆనంద నటనప్రకాశం — నటనమాడి తిరుంద — యిత్యాది పాటలకు నర్తనం పేరు.

పై గాథలలోని యితివృత్తము కేవలం బీభత్స ప్రాధాన్యం కల్గినట్టిది — పదకొండు విధములైన ప్రాచీన ద్రవిడ నర్తనములు.

1. అలియం — బాలకృష్ణుని హతమార్చాలనే దురుద్దేశ్యముతో కంసుడు కృష్ణ బలరాములను మథురకు ఆహ్వానిస్తాడు. అచ్చట వారు అనేక అపాయాలకు గురియౌతారు. 'కువలయాపీడ' మనే రాజుగారి ఏనుగు వారిపైకి వదలబడుతుంది. అది వారిని హతమార్చుటకు యత్నించు. కృష్ణుడు కడు చిత్రగతుల నర్తనమాడి ఆ ఏనుగు దంతములను పెరికి వాటితోనే దానిని సంహరిస్తాడు. ఆ ఏనుగుతో అతడు పోరాడినప్పటి హస్త పాద విన్యాసములే 'అలియం' అనే నర్తనముగా పేర్కొనబడినది.

2. కొడుకొట్టి — ధరణి రథమై బ్రహ్మ రథసారథిగా, మేరువు విల్లుగా, మహా విష్ణువును అమ్ముగా దాల్చి, దేవతలు వెంటరాగా మహాదేవుడు త్రిపుర సంహారానికి బయలువెడలినాడు. రథానికి చక్రములు సూర్య చంద్రులైనారు. నాల్గు వేదములు నాలుగు గుఱ్ఱములైనవి. మహాదేవుడు త్రిపురాది అసురులను సంహరించి వారి కోటలను ధ్వంసము చేసినాడు. కాలిపోయిన ఆ పురములయొక్క బూడిద పై నిలచి మహాదేవుడు విజయతాండవము నాడినాడు. అప్పుడు భైరవి తాళధారియైనది. ఇదియే కొడుకొట్టి.

3. కుడై — అసురులను సంహరించి దేవతల కష్టములను బాపుటకు కుమారస్వామి యుద్ధము చేసినసమయములో అతనిచే చేయబడినట్టి నర్తనము కుడై — రాక్షసులు వారి వద్దనున్న వివిధ బాణములన్నిటిని, ప్రయోగముచేసి, ఓడిపోయి నిరాశచెంది భీతితో దేవ సేనాపతి కుమారుని ఎదుట నిల్చినారు. అతడు ఆనందముతో

తన పథానికున్న ఛత్రమును తీసి దానిని చేతబట్టుకొని సల్పిన నర్తనమే కుడై. కుడై తమిళంలో గొడుగుకు పేరు.

4. కుడం – బాణాసురుడు గొప్ప శివభక్తుడు. అతని కుమార్తె ఉష. ఆమె కలలో కృష్ణుని మనమడైన అనిరుద్ధుని చూచి మోహిస్తుంది. ఆమె చెలికత్తె చిత్రలేఖ. బాణాసురునికి తెలియకుండా అనిరుద్ధుని ఆమె మహల్‌కు గొని వస్తుంది. కొంత కాలము అనిరుద్ధుడు బాణాసురుని కోటలో నుండిన పిదప, అతడు తెలిసికొంటాడు. అనిరుద్ధుని చెరలో నుంచుతాడు. అతని విడిపించుటకు, శ్రీకృష్ణుడు యిత్యాదులు మాయావేషములో బాణాసురుని పురము కేగి వివిధరీతుల నర్తన మాడతారు. అందు శ్రీకృష్ణునిచే చేయ బడినటిది యీ కుడం నర్తనము.

మట్టి మరియు పంచలోహముంతో కలిపి చేయబడినట్టి ఒక కుండనుచేత ధరించి దానిపై తాళ జతుల పలికించుతూ శ్రీకృష్ణుడు మాయా వేషములో బాణాసురుని పురములో నర్తన మాడినాడు. కుండచేత గొని ఆడుటచే 'కుడం' నర్తనమని పేరు వచ్చినది. 'కుడం' అనగా తమిళంలో కుండ.

5. పేడి – అనిరుద్ధుని తండ్రియైన ప్రద్యుమ్నుడు పేడివారు (నపుంసకులు) వలె వేషధారణ చేసుకొని ఆ పురము వీధుల్లో నాట్యమాడినాడు. తన కుమారుని చెర విడిపించెడి యత్నములో–

6. కడయం–బాణాసురుని పట్టణమైన శోణిత పురముయొక్క ఉత్తర ద్వారం, ఆవల విశాలమైన మైదానములో ఇంద్రాణి ఆఖరి నర్తనమాడినది. ఆఖరి నర్తనం గాన 'కడయం' అన బడినది.

7. మల్ లేక మల్లయుద్ధము – అనిరుద్ధుని విడిపించే ప్రయత్నములో శ్రీకృష్ణుడు మల్లుని వలె వేషధారణ చేసుకొని రాజవీధుల్లో తిరుగుతూ అనిరుద్ధుని చెర విడిపించ మనియు, తనతో ఎవరైననూ మల్లయుద్ధమునకు రావచ్చుననియు. సవాల్ చేసెను. బాణాసురుడే కృష్ణునితో యుద్ధమునకు దిగెను. శ్రీకృష్ణు డాతని అందు ఓడించి సంహరించెను. అదియే మల్ లేక మల్లయుద్ధము.

కుడం, పేడి, కడయం, మల్ – ఈ నాలు నర్తనములు అనిరుద్ధుని చెర విడిపించుటకు శ్రీకృష్ణ బలరాముదులు అసుర పురమునకేగి చేసిన నర్తనములు.

8. పాండురంగము – త్రిపుర సంహారానంతరము సృష్టి క్రమమును తెల్పునట్టి నర్తనము భైరవమూర్తి ప్రదర్శించెను. సృష్టికర్త బ్రహ్మదేవుడు రథ సారథియై నిలిచి చూడగా, భస్మమైన రించిన త్రిపురముల తెల్లని బూడిదను శరీరమునకు అలదుకొని శ్మశాన వాటికగా మారిన ఆ ప్రదేశమును రంగస్థలముగా అతడు నర్తనము సల్పెను. పాండు – అనగా తెలుపు, రంగము – రంగస్థలము అని అర్థము.

9. సురపద్మ అనే అసురుడు మహాసేనునితో యుద్ధముచేయుచూ తన మంత్రశక్తిపల్ల సముద్రతరంగముల్లో దాక్కొనినాడు, కార్తికేయుడు అది కనుగొని అతనిని సంహరించి తరంగములతో కదిలాడు సముద్ర జలరాశిని రంగస్థలముగా ఆనందంతో నర్తన మాడినాడు –

10. మరక్కాల్ – మహాదేవుడు అసుర సంహారమునకు గడంగిన సమయాన, ఆయన ధాటికాగలేక – మాయోపాయముచే పరమశివుని సంహరించ నెంచి, అసురులు క్రూరసర్పములు, తేళ్లు మొదలైన విషజంతు జాలములుగా మారి దేవసైన్యముల మధ్యకు ప్రాకజొచ్చినవి. అంత శ్రీ మహావిష్ణువు సోదరి మహాదేవి ఉగ్రురాలై గెడగర్రలపై నిల్చి యుద్ధభూమిలో నర్తనమాడి వారిని సంహరించెను. అదియే మరక్కాల్ – కర్ర కాళ్ళ నృత్యం.

11. పావై – అసుర సంహారము చేయుటలో లక్ష్మీదేవి వారి వలె మాయోపాయంతో వారిని సంహరింప దలచి, ఒక త్రిలోక సుందరి రూపము దాల్చి నర్తనమాడ మొదలిడినది. రాక్షసులు వ్యామోహితులై అస్త్రశస్త్రములను విడచివేసి ఆమె వెంటబడిరి. అప్పటి ఆమె నర్తనమే పావై.

ఈ నృత్యముల యితివృత్తము లన్నింటిని చూచిన యివి కథారూపపు నాట్యములు. కొన్ని శుద్ధ నృత్యములు, విందులు, వినోదకములు గాని నేటి కాలంలో ప్రచారములో నున్న భరత నాట్యము లోని నృత్త, నృత్య, అభినయ విన్యాసముల పోకడలు మనకు కన్పించవు. కనుకనే నాయక రాజులకాలము నుండియే తమిళదేశములో శాస్త్రీయ నృత్య ప్రదర్శన క్రమముగా ప్రచారములోనికి వచ్చినదని పండితుల అభిప్రాయం – శాస్త్రీయ శిక్షణ పద్ధతి ప్రచారములో నుండిననూ ఆ క్రమము ననుసరించి నృత్యప్రదర్శన పద్ధతి (కచ్చేరిఆట) మాత్రం తెనుగురాజుల, మహారాష్ట్ర ప్రభువుల దర్బారులందు రూపొందినది.

—0—

